# అజంతా, ఎల్లోరా గుహల కాపుదారీ పనులు

## 2 లక్షల రూ. ల వ్యయంతో నిర్వహణ

సికిందరాబాదు, సెప్టెంబరు 22: ప్రపంచ ప్రసిద్ధమైన అజంతా, ఎల్లోరా గుహల వైభవాన్ని నాశిదానికుండా కాపాడడానికి కావలసిన కార్యకలాపాలను హైదరాబాదు ప్రభుత్వంవారు 2 లక్షల రూ. ల దాకా ఖర్చు పెట్టి కొనసాగించారు. ఇంకా 20 వేల రూ. లు ఖర్చు పెట్టి అజంతా ...

ఇంతవరకు జరిగిన కార్యకలాపాలను తనిఖీ చేయడం నిమిత్తం ఇండియా ప్రభుత్వపు అర్కియాలజీ ఇంజనీయరు లక్ష్మీనారాయణగారు సోమవారం ఇక్కడికి రానున్నారు. ఆయన వారం రోజులు ఇక్కడ ఈపనిమీద ఉంటారు. వీటిని గురించి ఇంకా ఏమైనా సలహాలు చేయదగినవి వుంటే చేస్తారు.

ఈ ఉభయ గుహల నిర్వహణ త్వరలో నే ఇండియా ప్రభుత్వపు అర్కియాలజీ వారి అజమాయిషీకి వెళ్లనున్నది. ఇప్పుడు ఈ పనులకు గాను హైదరాబాదు ప్రభుత్వం ఖర్చు పెడుతున్న సొమ్ము ఇండియా ప్రభుత్వంవారు ఇచ్చుకొంటారు.

శ్రీ శ్రీ పటేలుగారు ఆశించిన మేరకు ఈ గుహలకు శీలింతని చిరస్థాయిగా దాని కాపీలను భద్రపరచటం గురించి ప్రభుత్వంవారు ... ఇంకా ఒక నిర్ణయానికి రాలేదు.

# కాంగ్రెస్ విజయం ఖాయం

## కాంగ్రెసు నాయకుల విశ్వాసం

మద్రాసు, సెప్టెంబరు 21: "రాయలసీమలో ప్రజాహృదయం కాంగ్రెస్ పైనే లగ్నమైందని మా సంచారంవల మరల ఒకసారి వ్యక్తమైంది. పనుల్లూ, ఉత్సాహవంతులు అయిన వారెందరో కాంగ్రెస్ అభ్యర్థులుగా ఎన్నికలకు దరఖాస్తులు పెట్టారు. కాంగ్రెస్ సందేశాన్ని వినటానికి వేలకొద్ది ప్రజలు బహిరంగ సభలకు హాజరయ్యారు. ఈసారి కాంగ్రెస్ ఎన్నికల్లో విజయంపొందటం ఖాయం" అని ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు తెలుపుతున్నారు. సంజీవరెడ్డిగారు ఇట్లా చెప్పారు:- "నేను, చంద్రమౌళిగారు, అల్లూరి దరఖాస్తులు వెయ్యలేదు. గాని మా పేర్లు కొందరు సూచించారు. నేను పార్లమెంటుకు వెళ్లాలో, శాసనసభకు నిలవాలో నిర్ణయించుకోలేదు. ఆదోని, ఆలూరు, శిరిగొప్ప, కర్నూలు, ప్రత్తికొండ, ప్రజాప్రతినిధి సభ స్థానానికి రెవిన్యూమంత్రి హాలహర్వి సీతారామరెడ్డిగారు, టి. భాస్కరరావు నాయుడుగారూ కాంగ్రెస్ అభ్యర్థులుగా దరఖాస్తులు పెట్టారు. 1వ తేదీ లోపల మా సంచారం పూర్తి చేసుకుంటాము. అభ్యర్థులకు దరఖాస్తు తేదీ ఈనెల 14వ తేదీతో నే అంతమై పోయింది."

"కాంగ్రెసు నుంచి నిష్క్రమించిన వారు తిరిగి కాంగ్రెసులోకి యధాప్రకారంగా రావచ్చును. వారిని హృదయపూర్వకంగా మళ్లా ఒకసారి ఆహ్వానిస్తున్నాను."

### చంద్రమౌళిగారి అభిప్రాయం

"సోషలిస్టులు, ప్రజాపార్టీ, కమ్యూనిస్టులూ అంతా ఏకమై కాంగ్రెసుతో పోటీచేసినా కాంగ్రెసు గెలుపు నిశ్చయం. సోషలిస్టులు, ప్రజాపార్టీవారూ కమ్యూనిస్టులతో కలవబోమని చెబుతున్నారు. కలిశారా, వారు తీసుకొన్న గోతులో వారే పడతారు. వీరంతా కలిస్తే కాంగ్రెసుకు బలమైన పోటీవస్తుంది. గాని అది సంభవమని నేననుకోను" అని స్థానిక కాంగ్రెసు మాతృల కల్లూరి చంద్రమౌళి గారు పత్రికా ప్రతినిధులతో చెప్పారు. సమస్తులూ, ప్రజాసేవకులూ అయిన వెనకబడ్డ జాతులవారు, విద్యావంతులైన స్త్రీలు దరఖాస్తులు పెట్టారనీ, ప్రారబ్ధం వచ్చినంత గెలుపు లేకపోయినా అధిక సంఖ్యాక స్థానాలను కాంగ్రెసు గెలువగలదనీ చెప్పారు.

### బొమ్మకంటి సత్యనారాయణ రావుగారి రాజీనామా

హైదరాబాదు, సెప్టెంబరు 22: వరంగల్లు జిల్లా కాంగ్రెసు అధ్యక్షులైన బొమ్మకంటి సత్యనారాయణ రావుగారు తమ అధ్యక్షపదవికి రాజీనామా యిచ్చారు. శాసనసభ అభ్యర్థిత్వాన్ని కూడా ఉపసంహరించుకొన్నారు. జిల్లా కాంగ్రెసులోని అంతరంగిక విభేదాలూ ఎన్నికల సంఘానికి అభ్యర్థులను సిఫార్సు చేయడంలో ఆయనకూ తదితర కాంగ్రెసు పెద్దలకూ ఏర్పడిన అభిప్రాయభేదాలే ఈ రాజీనామాకు కారణమైనట్లు అనుకొంటున్నారు.

### కడపకు కాంగ్రెసు ఎన్నికల సంఘంవారి ఆగమనం

కడప, సెప్టెంబరు 21: ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసువారు రాబోయే ఎన్నికలకు అభ్యర్థులను నిర్ణయించేందుకుగాను 7 గురు సభ్యులతో ఏర్పాటుచేసిన సంఘంవారు నిన్న నిక్కడకు వచ్చి దరఖాస్తుదారులను చూచారు. రాష్ట్ర ఎసెంబ్లీ 8 స్థానాలకు మొత్తం 34 గురు దరఖాస్తు చేశారు. నిర్ణీతమైన అభ్యర్థుల జాబితా అక్టోబరు 4 న ప్రకటిస్తారు.

### టాటా ఇన్‌స్టిట్యూట్ విద్యార్థి సంఘ అధ్యక్షుడు ఆంధ్రుని ఎన్నిక

బొంబాయి, సెప్టెంబరు 18: బొంబాయి ఆంధ్ర విద్యార్థి సంఘ ప్రధాన కార్యదర్శి బి. వి. ఎస్. పాత్రుడుగారు, టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్ విద్యార్థి సంఘానికి 33 ఓట్ల మెజారిటీతో అధ్యక్షులుగా ఎన్నికైనారు. 15 సంవత్సరాల టాటా సాంఘిక విద్యాలయ చరిత్రలో ఆంధ్ర విద్యార్థి కీగౌరవం లభించటం యిదే ప్రథమం.

### 4 గురు కర్నూలు వాసుల నిరశనవ్రత విరమణ

కర్నూలు, సెప్టెంబరు 20: ఆంధ్ర రాష్ట్ర ... నిరశనవ్రతం చేస్తున్న 4 గురు ... నిరశన దీక్షను విరమించారు.

# అజ్ఞాత వాసంనుండి రావి నారాయణరెడ్డి అవతరణ

హైదరాబాదు, సెప్టెంబరు 22: హైదరాబాద్ సంస్థాన కమ్యూనిస్టు పార్టీ ప్రముఖ నాయకుడు రావి నారాయణరెడ్డి, అజ్ఞాతవాసంనుంచి ఈ ఉదయం బయటకు వచ్చాడు. ... ఈయన హైదరాబాదులో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం పెట్టినది లగాయతూ అజ్ఞాతవాసంలో ఉంటున్నారు. (స్వ. వి.)

# కర్నూలు జిల్లాలో ప్రాజెక్టులు

## పూర్తికావస్తున్నట్లు ఎగ్జిక్యూటివ్ యింజనీరు ప్రకటన

కర్నూలు, సెప్టెంబరు 17: ఈ జిల్లా అధికారులతో సమావేశం యిటీవల జిల్లా కలెక్టరు పి. వి. మాధవరావుగారి అధ్యక్షతను యిక్కడ జరిగింది. నూతనంగా జరుగుతున్న చెరువుల త్రివ్వకమూ, పాణ్యం, ... పల్లె ప్రాజెక్టుల పనులు మురునగా జరుగుతున్నట్లు ఎగ్జిక్యూటివ్ యింజనీరు ప్రకటించారు. ...

# కర్నూలు జిల్లాలో ప్రాథమిక విద్య

## 92 గ్రామాలలో నిర్బంధవిధిగా సాగుతున్నట్లు జిల్లాబోర్డు ప్రకటన

కర్నూలు, సెప్టెంబరు 19: మొన్న జరిగిన జిల్లాబోర్డు సమావేశములో 1950-51 సంవత్సర పరిపాలన నివేదిక సభ్యుల ఆమోదానికి వచ్చింది. జిల్లాలో 92 గ్రామాలలో నిర్బంధ ప్రాథమిక విద్య ప్రవేశ పెట్టినట్లు ఆ నివేదికలో పేర్కొనబడింది. నివేదికలో దిగువ అంశాలు కూడా వున్నాయి. ఈ సంవత్సరం ప్రాథమిక పాఠశాలల సంఖ్య 598 నుండి 635 కు పెరిగింది. వీటిలో 1678 ఉపాధ్యాయులు, 58589 మంది బాలబాలికలు వున్నారు. ఈ విద్యాభివృద్ధికై రు. 13,00,950/- ... 818 మంది ఉపాధ్యాయులు వున్నారు. ... జిల్లాబోర్డు ఆర్థిక పరిస్థితి:

| | | |
|---|---|---|
| ఆరంభ నిల్వ | రు. | 4,71,877/- |
| ఆదాయం | రు. | 30,60,918/- |
| వ్యయం | రు. | 30,98,882/- |
| నిల్వ | రు. | 4,33,908/- |

... (స్వ. వి.)

# పోలీసు పటేల్ భూమిని సాగుచేస్తున్న రైతు హత్య

## మెదక్ జిల్లాలో జరిగిన దారుణ సంఘటన

హైదరాబాదు, సెప్టెంబరు 21: మెదక్ జిల్లా పీలారం గ్రామం పోలీసు పటేలు కౌలుకు భూములు సాగుచేస్తున్న రైతును మొన్న 19 వ తేదీ నాడు ... సాయుధ దుండగులు కాల్చి చంపివేసినట్లు అధికారికంగా ఇవాళ ఇక్కడికి వచ్చిన ఒక వార్త తెలుపుతున్నది.

ఆక్రమణ కోసం వారొక ముగ్గురు దుండగులు ఆ జిల్లా పెరారంపల్లి మీద దాడిచేసి, కొందరు గ్రామస్థులకు దేహశుద్ధిచేసి పోలీస్ పటేల్ రికార్డులు తగల పెట్టినట్లు కూడా సదరు వార్త తెలుపుతున్నది.

# ధాన్యం లారీలపై కమ్యూనిస్టు ఆగడం

## మూడువరిబస్తాల తస్కరణ

హైదరాబాదు, సెప్టెంబరు 21: ఖాకీ పచ్చ యూనిఫారాలు ధరించి, ... 50 మంది సాయుధ కమ్యూనిస్టులు మొన్న 18-వ తేదీనాడు ... అందులో ఒక లారీని ... 50 వడ్ల బస్తాలతో వాస్తూవుండిన ఒక లారీ ... మూడు బస్తాలు ఎత్తుకొని పారిపోయారట. ...

### రద్దు చేయించుకోబోయిన శిక్ష ఖాయం

హైదరాబాదు, సెప్టెంబరు 21: హత్యకూ, లూటీకీ, ఆస్తి తగలపెట్టినా గాను క్రింది కోర్టువారు శిక్షించిన ముస్లిములకు విధించిన మరణశిక్షనూ, మరిముగ్గురికి విధించిన యావజ్జీవశిక్షనూ హైదరాబాదు హైకోర్టు డివిజన్ బెంచివారు సెటిదినం ఖాయం చేశారు.

వీరున్నూ, మరికొందరున్నూ కలసి, 1948 లో పోలీసు చర్య జరిగిన రెండురోజులకు పర్భని జిల్లాలోని ఒక గ్రామం మీదికి దాడిచేసి, గ్రామస్థుల్లో 10 మందిని హత్యచేసి, కొన్ని యిండ్లు తగలబెట్టి, 30 వేల రూ. ల దాకా విలువచేసే ఆస్తి దోచుకుపోయినట్లు ప్రాసిక్యూషన్ వారి కథనం.

పర్భని స్పెషల్ ట్రిబ్యూనల్ వారు ఈ కేసును విచారించి ముస్లిరికి మరణ శిక్షనూ, మరి ముగ్గురికి యావజ్జీవ శిక్షనూ విధించారు. అందుపై ముద్దాయిలు అప్పీలు చేసుకోగా, కోర్టువారు దానిని కొట్టివేశారు.

### పులివెందలలో ఇసుప వ్యాపారి అరెస్టు

కడప, సెప్టెంబరు 16: దొంగమార్కెటు నిరోధక శాఖ యిన్‌స్పెక్టరు సుబ్రహ్మణ్యం గారు, ... సహాయంతో యినుప కడ్డీలను హెచ్చువెలలకు అమ్మినందుకు పులివెందల యినుప వ్యాపారి డి. వెంకట్రామయ్యను యిటీవల అరెస్టు చేశారు. (స్వ. వి.)

### బద్వేలులో భూమి అదురు

బద్వేలు, సెప్టెంబరు 21: నిన్న సాయంకాలం 6-30, 6-50 గంటలకు భూమి అదిరింది. ఒకటి, ఒకటిన్నర సెకండ్లు మాత్రం వున్న యీ అదురును గ్రామస్థులందరూ గుర్తించారు.

### తిరుపతిలో నీటికి యిబ్బంది

తిరుపతి, సెప్టెంబరు 19: ... తిరుపతి గ్రామంలో నీటికి చాలా యిబ్బందిగా వున్నది. ... వారి ప్రథమ కర్తవ్యం. స్వ. వి.

# అపురూప సంస్కృత గ్రంథ వ్రాతప్రతులు

## ప్రకటన విషయమై ఉస్మానియా విశ్వవిద్యాలయ శ్రద్ధ

హైదరాబాదు, సెప్టెంబరు 20: అపురూపమయినట్టివిన్ని, ఇది వరకు ఎక్కడా ప్రచురణ కొనట్టివిన్ని సంస్కృతి గ్రంథాలను పండితులచేత చక్కగ పరిష్కరింపించి ప్రకటించవలెనని ఉస్మానియా విశ్వవిద్యాలయం వారికి చాలా ఆసక్తిగా ఉన్నది. ... సకల భారతి ... ప్రాధాన్యమిస్తూ చాలామంది దీనిని అభ్యసించడానికి వీలుంటుందని ఆయన ఉద్ఘాటించారు.

రాజా బహదూర్ ఆరావముదయ్యంగారి అధ్యక్షతను విశ్వవిద్యాలయ స్థానికంగా ఒకశాఖ ఏర్పాటు చేయబడింది.

# ధర్మాదాయాల నిర్వహణ

మదరాసు, సెప్టెంబరు 18: ధర్మాదాయాల చట్టం అమల్లోకి రాగానే ప్రస్తుతపు బోర్డు స్థానే కమిషనర్, ముగ్గురు డిప్యూటీ కమిషనర్లను నియమిస్తారు. ధర్మాదాయాలచట్టం సెప్టెంబరు 30 వ తేదీ నుండి అమల్లోకి వస్తుందని ప్రభుత్వంవారు లోగడనే ప్రకటించారు.

కమిషనర్ కార్యాలయం మదరాసులోనూ డిప్యూటీ కమిషనర్ల కార్యాలయాలు గుంటూరు, కోయంబత్తూరు మధురలో ఏర్పాటు చేస్తారని తెలుస్తోంది. ... ధర్మాదాయాలకూడ ముఖ్యమంత్రి అధీనంలో వున్నాయి.

### "ఆంధ్ర ప్రజ"

బొంబాయి, సెప్టెంబరు 17: ... "ఆంధ్రప్రజ" అనే వారపత్రిక, రాష్ట్రేతరాంధ్రుల పత్రికగా బొంబాయినుండి వెలువడనుంది.

### హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్)

(వర్తకులకు సిద్ధ ధరల వివరం)

హైదరాబాదు, సెప్టెంబరు 22: బంగారం ... వెండి 100 కు 214-0-0. ...









# టెండరు నోటీసు

## భీమవరం మునిసిపాలిటీ

దిగువ వివరించిన పనులకు సీలు వేసిన టెండర్లు 29-9-51 సా. 4 గం.ల వరకు తీసుకోబడును.

| పనుల నం. | పని పేరు | ఎస్టిమేటు మొత్తము | టెండరు డిపాజిట్లు | టెండరు ఫారంఖరీదు |
|---|---|---|---|---|
| | | రు | రు | రు అ |
| 1. | భీమవరం నరసాపూర్ రోడ్డు మెయింటెనెన్సు | 12,800 | 640 | 4- 0-0 |
| 2. | రెస్టు హౌస్ రోడ్డు ,, | 10,000 | 500 | 3- 2 0 |
| 3. | భీమవరం అత్తిలి రోడ్డు ,, | 7 200 | 360 | 2 4 0 |
| 4. | గాలివారి రోడ్డు | 4,800 | 240 | 1- 8-0 |
| 5. | గవర్నమెంటు ... రోడ్డు | 5,200 | 260 | 1 10 0 |
| 6. | సుడ్ షెడ్ ... | 5,200 | 280 | 1-10-0 |
| 7. | భీమవరం ... రోడ్డు ,, | 7,500 | 375 | 2- 6-0 |
| 8. | అమ్మవారి ... వీధి | 2,500 | 125 | 0-13-0 |
| 9. | ఉప్పుటెంట, మంగలివీధి ,, | 2,300 | 115 | 0-12-0 |
| 10. | గౌస్ సాహెబ్ వీధి ,, | 1,450 | 75 | 0- 7-0 |
| 11. | వెంకటపల్లివారి రోడ్డు ,, | 1,600 | 80 | 0- 8.0 |
| 12. | తాలూకాఫీసు రోడ్డు ,, | 1,200 | 60 | 0- 6-0 |
| 13. | రాయసంవారి రోడ్డు ,, | 560 | 30 | 0- 4-0 |
| 14. | డెయిలీ మార్కెటులో పక్కా మార్కెటు షెడ్డు నిర్మించుట | 3.200 | 160 | 1- 0-0 |
| 15. | నెం. 2 కుమ్మర్ల వీధికి కంకర వేయుట | 880 | 45 | 0- 5-0 |
| 16. | చేతని పేట మెయిన్ రోడ్డుకు కంకర వేయుట | 650 | 35 | 0- 4-0 |
| | | 67,040 | 3,360 | 21- 8-0 |

షరా:- టెండర్లు, ఎస్టిమేటు రేట్లకు తక్కువగాగాని ఎక్కువగాగాని సర్వం జేజి పద్ధతిలో వుండవలెను.

2. దరఖాస్తుమీద టెండరు నోటీసులు, వాటికి సంబంధించిన యితర కాగితములు సప్లయి చేయబడును.

(సం) ఎం. వి. కృష్ణారెడ్డి,
కమీషనరు.

## అమెరికా-భారతదేశ స్నేహ సంబంధాలు

### లాయ్ హెండర్సన్ వీడ్కోలు సందేశము

న్యూఢిల్లీ, సెప్టెంబరు 19: స్వాతంత్ర్యం చేకూరిన నాటినుండి భారతదేశంయెడల అమెరికా మిత్రభావం చూపుతున్నది. ఇకమీదటకూడ అమెరికా భారతదేశంతో మిత్రభావమును వుంచగోరుతున్నది. ఈ విషయాన్ని భారతీయులు జ్ఞాపకముంచుకొంటారని ఆశిస్తున్నాను' అని ఇరానులో అమెరికా రాయబారిగా వెళ్తున్న లాయ్ హెండర్సన్ తన వీడ్కోలు సందేశంలో చెప్పుతున్నారు.

అమెరికా భారతదేశాల మిత్రత్వము ఉభయదేశాలకు లాభదాయకము మాత్రమే గాక ప్రపంచశాంతికి సాధనభూతమగునన్న దృఢ నమ్మకంతో మూడేండ్ల క్రిందట నేను భారతదేశానికి అమెరికన్ రాయబారిగా వచ్చాను. ఉభయదేశాల మైత్రత్వానికి నేను ఈ మూడేండ్లనుండి కృషి చేశాను. ఈ మూడేండ్లలో నేను భారతదేశ వ్యవహారాల్లోను, భారతప్రజల శ్రేయస్సులోను గైకొన్న శ్రద్ధ ప్రేమగా పరిణమించింది. భారతీయులు నాయెడలను నా భార్యయెడలను చూపిన ప్రేమను, ఆదరణను నేను ఎన్నటికీ మరచిపోలేను. ఇక్కడినుండి వెళ్ళిపోవలసి వచ్చినందుకు చాలా చింతిస్తున్నాను' అని లాయ్ హెండర్సన్ గారు తన సందేశంలో చెప్పుతున్నారు.

### షెడ్యూల్డు తరగతుల ఫెడరేషను

పూనా, సెప్టెంబరు 20: యూనియను ప్రజాసభకు, వివిధ రాష్ట్రీయ శాసనసభలకు అభ్యర్థులను ఎంచుకొనడానికిగాను అ. భా. షెడ్యూల్డు తరగతుల ఫెడరేషను కార్యవర్గం అక్టోబరు 6 న ఢిల్లీలో సమావేశమవుతుంది.

### ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనేటు సభ్యుల ఎన్నిక

వాల్తేరు, సెప్టెంబరు 19: ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటుకు తెలుగు భాషా నియోజకవర్గ ప్రతినిధిగా జి. వి. సోమయాజి (యూనివర్సిటీ కాలేజి, వాల్తేరు) గారు పోటీ లేకుండా ఎన్నికైనట్లును, కడపజిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గంనుంచి ఆ జిల్లాబోర్డు సభ్యుడు సి. బాలిరెడ్డిగారు ఎన్నికైనట్లును రిజిస్ట్రారుగారు ప్రకటించారు.

## వచ్చే ఎన్నికలలో ప్రజాపార్టీ అభ్యర్థులు

### ప్రకాశం పంతులుగారి ప్రకటన

మదరాసు సెప్టెంబరు 21: ఆంధ్ర ప్రజాపార్టీ నాయకుడు టంగుటూరి ప్రకాశం పంతులుగారు క్రింది ప్రకటన గావిస్తున్నారు:

"అఖిల భారత కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ జనరల్ కార్యదర్శి సాదిక్ అలీగారు ఆంధ్రలో ప్రజాపార్టీ టికెటు మీద రాబోవు ఎన్నికలందు పోటీ చేయగోరు అభ్యర్థుల పేర్ల పట్టికను పంపవలెనని యిటీవల వారు వెలువరచిన సర్క్యులరులో కోరియున్నారు. బొంబాయిలో అక్టోబరు 22వ తేదీని సమావేశం కాగల అఖిలభారత ప్రజాపార్టీ కార్యవర్గ సభలో అభ్యర్థుల తుది నిర్ణయం కూడా జరుగగలదని వారు తెలిపియున్నారు. అందువల్ల ఆంధ్ర ప్రజాపార్టీ కార్యవర్గ సభ్యులందరు ఆయా జిల్లాల్లో ప్రజాపార్టీ టికెటు మీద ఎన్నికలందు పోటీ చేయవలచే వారి పేర్ల జాబితాలతో మదరాసులో యీ నెల 26వ తేదీని జరిగే ప్రజాపార్టీ కార్యవర్గ సభకు హాజరు కావాలని కోరుతున్నాను. రాష్ట్ర కమిటీవారు అభ్యర్థుల నిర్ణయము గూర్చి ఆలోచన చేసి పట్టికలను కేంద్రకమిటీకి అక్టోబరు 15 వ తేదీలోగా పంపటానికి వీలుపడునట్లు సభ్యులు తోడ్పడవలెను.

## పార్లమెంటరీ బోర్డు

### సంజీవిరెడ్డిగారికి స్థానం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 19: ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు, పార్లమెంటరీ వ్యవహారాల శాఖామంత్రి సత్యనారాయణ సిన్హాగారు కాంగ్రెసు కేంద్ర పార్లమెంటరీ బోర్డులో సభ్యులుగా నియమింపబడుదురని తెలుస్తున్నది. కాంగ్రెసు మాజీ అధ్యక్షుడు బాబు పురుషోత్తమదాసు టాండన్ గారిని పార్లమెంటరీ బోర్డులో నెహ్రూ ఉంచుతారనికూడా తెలుస్తున్నది.

పార్లమెంటరీబోర్డు త్వరలో, కాంగ్రెసు కార్యవర్గంచే పునర్నిర్మింపబోతున్నది. కార్యవర్గ ఆమోదానికి లోబడి, యీ దిగువవారిని పార్లమెంటరీబోర్డు సభ్యులుగా నామినేట్ చేయడం జరుగవచ్చు. పండిత నెహ్రూ, మౌలానా అజాద్, జగ్జీవనరాం, టాండన్, సత్యనారాయణ సిన్హా, సంజీవరెడ్డిగారలు బోర్డులో యిదివరకున్న సభ్యులు. టాండన్, నెహ్రూ, సి. రాజగోపాలాచారి, జగ్జీవనరాం, మౌలానా అజాద్, పండిట్ డి.పి.మిశ్రాగారలు.

## సిరోహీ సంస్థానమాజీ అధిపతి బర్తరఫు

### సుప్రీంకోర్టు నిరాకరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: క్రిందటి ఏడాది అక్టోబరు 7 వ తేదీని సిరోహీ సంస్థానాధిపతి మహారావ్ తేజ్ సింహ్‌జీని తొలగించి, ఆయన స్థానంలో అభయ్ సింహ్‌జీని అధిపతిగా సర్టిఫై ఇండియా అధ్యక్షుడు ఒక ఉత్తర్వు జారీచేశారు. ఆ ఉత్తర్వు చెల్లదని వాదిస్తూ మాజీ అధిపతి తేజ్ సింహ్‌జీ పెట్టుకున్న దరఖాస్తును ఇండియా సుప్రీంకోర్టు నేడు నిరాకరించినది. అట్టి ఉత్తర్వు జారీచేసే అధికారం అధ్యక్షునికి లేదనీ, సంస్థాన విలీనీకరణ ఒడంబడికకు అది విరుద్ధమనీ దరఖాస్తుదారు వాదించారు. రాజ్యాంగచట్టం రీత్యా అట్టి అధికారం అధ్యక్షునికి ఉన్నదనీ, ఆయన ఉత్తర్వు చెల్లుబడి అవుతుందనీ సుప్రీంకోర్టు తీర్పు చెప్పినది.

## బొంబాయి శాసన సభ్యుని క్షమాపణ

పూనా, సెప్టెంబరు 20: బొంబాయి శాసనసభలోని మజ్దూర్ కార్మికపక్ష సభ్యుడు శ్రీ డి. ఎ. దేశముఖ్ తాను శాసనసభలో చేసిన ఒక ప్రకటనకు యీరోజున క్షమార్పణ కోరుతున్నారు. మరాఠీలో ప్రసంగిస్తూ, హింసాత్మకమైన పద్ధతులు అవలంబించి ప్రభుత్వాన్ని కూలద్రోసే హక్కు ప్రజలకు ఉన్నదని ఆయన చెప్పినట్లు హోమ్‌శాఖామంత్రి ఆరోపించారు. ఆ ఆరోపణ సరిఅయినది కాదని శ్రీ దేశముఖ్ సమాధానం చెప్పారు. షార్టుహాండ్ నోట్సు చూడగా ఆయన అవిధంగా అన్నట్లు ఋజువయినది. దానిపై అధ్యక్షుని సూచనకు అనుగుణంగా శ్రీ దేశముఖ్ క్షమార్పణ కోరుకున్నారు.

### కాంగ్రెస్ అభ్యర్థి నామినేషను నిరాకరణ

నహాన్ (హిమాచల ప్రదేశ్) సెప్టెంబరు 20: హిమాచల ప్రదేశ్ లోని చంబా-పీర్‌పూర్ నియోజకవర్గాన్నుండి ప్రజాసభకు పోటీ చేస్తున్న కాంగ్రెసు అభ్యర్థి నామినేషను కాగితాన్ని రిటర్నింగ్ ఆఫీసరు నిన్న నిరాకరించారు. నామినేషను కాగితంపై కాంగ్రెసు అభ్యర్థి పేరు లేదని ఒకపక్షానికి చెందిన అభ్యర్థి ఆక్షేపించాడు. తక్కిన ముగ్గురి అభ్యర్థుల నామినేషను కాగితాలు చెల్లుతవని రిటర్నింగ్ ఆఫీసరు నిర్ణయించాడు. సెప్టెంబరు 22 లోపుగా నామినేషన్లను ఉపసంహరించుకోవచ్చును.

## ఢిల్లీలో కాంగ్రెస్ మహాసభ ఏర్పాట్లు

### 'సత్యవతీనగర్' నిర్మాణానికి నిర్ణయం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: 57 వ కాంగ్రెసు సభాస్థలి అయిన సత్యవతీ నగరులో పందిరి నిర్మించడానికి సన్నాహాలు ప్రారంభమైనవి. ఈ నగరలో 3,200 ప్రతినిధులకు, 8,200 మంది ప్రేక్షకులకు వసతులు కల్పిస్తారు. కాంగ్రెసు సమావేశాల్లో 50,000మంది కూర్చోడానికి సరిపోయే పందిరి వేస్తారు. ఖద్దరు, రాట్నాలు, స్వదేశీ వస్తువులు అమ్మే బజారు నగరులో వుంటుంది. సింహద్వారాన్ని అలంకరించే పనిని శ్రీమతి ఇందిరగాంధి చూస్తున్నది. నేడు ఆమె చిత్రకారులను సమావేశపరిచి అలంకరణకు సంబంధించిన విషయాలను చర్చించింది.

### 'ఆర్థిక విధానాన్ని స్పష్టంగా నిర్వచించాలి'

గ్వాలియర్, సెప్టెంబరు 20: వచ్చే కాంగ్రెసు మహాసభ భారతదేశం అవలంబించాల్సిన ఆర్థిక విధానాన్ని స్పష్టంగా నిర్వచించాలని శ్రీ శంకరరావుదేవుగారు మేమిద్దరము కలిసి ప్రయాణం చేస్తుండగా నాతో చెప్పారు. అని మధ్యప్రదేశ్ మాజీమంత్రి యశ్వంతసింహు షెవాగారు నేడు చెప్పారు. "లౌకిక రాజ్యస్థాపన విషయమునను విదేశాంగ విధానం విషయమునను పండిత నెహ్రూగారు చూపుతున్న దార్ఢ్యాన్ని అభ్యుదయ ఆర్థిక విధానం విషయమైకూడా చూపాలి. నిరుద్యోగులకు ఉద్యోగం చూపడము భూమి లేనివారికి భూములివ్వడం ఇప్పుడు ముఖ్యము. కాంగ్రెసులోనికి క్రొత్తవారిని చేర్చుకొని కాంగ్రెసును బలపరచాలి. అని శ్రీ శంకరరావుదేవ్ గారు చెప్పినట్లు యశ్వంతసింహుగారన్నారు.

### ఓటర్ల జాబితాల ప్రకటన

మదరాసు, సెప్టెంబరు 21: అసెంబ్లీ నియోజకవర్గాలు 3[illegible]2 పార్లమెంటు నియోజకవర్గాలు 62 తాలూకు ఓటర్ల జాబితాలు ప్రకటించుటకు సిద్ధంగా వున్నవని ప్రధాన ఎన్నికోద్యోగి నేడు విలేఖరులకు తెలియజేశారు.

అయితే నియోజకవర్గములలో కొన్ని స్వల్పమార్పులు జరుగవలసిన 84 అసెంబ్లీ 25 పార్లమెంటరీ నియోజకవర్గాలకు సంబంధించిన జాబితాలు తప్ప మిగిలినవానిని జారీ చేయవలసిందని వుత్తర్వులిచ్చారు.

ఓటర్ల జాబితాలు ఎట్లు అమర్చేది వివరిస్తూ ప్రధాన ఎన్నికోద్యోగి ఇట్లా అన్నాడు. అసెంబ్లీ నియోజకవర్గ జాబితాపైన నియోజకవర్గంలోని వివిధ్య విస్తీర్ణం ఉదహరిస్తారు. తరువాత తాలూకాల జాబితా అక్షరక్రమానుసారం వుంటాయి. తాలూకాలో గ్రామాల పేర్లు కూడా అల్లాగే అమరుస్తారు. పార్లమెంటరీ నియోజకవర్గం విషయంలో ఆ నియోజకవర్గంలోని అసెంబ్లీ నియోజకవర్గాలు (ఏకసభ్య నియోజకవర్గం అయితే 6, జంట నియోజకవర్గం అయితే 10) అక్షరక్రమంగా అల్లాగ అమర్చెదరు.

ఓటర్ల జాబితాలు సిద్ధంకాగానే ఎలెక్టోరల్ ఉద్యోగులు నికర జాబితాలు ప్రకటించబడ్డట్లు ప్రకటించి ఆ వైనమును స్థానిక విలేఖరులకు తెలియబరుస్తారని అన్నారు.

## డిప్యూటీస్పీకర్‌ను అధిక్షేపించే వ్యంగ్యచిత్రం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: స్థానికంగావున్న ఒక ఇంగ్లీషు పత్రికలలో హిందూ కోడు బిల్లు ప్రతిపక్షులను వెక్కిరిస్తూ ప్రకటింపబడిన కార్టూన్ చిత్రింపట్ల డిప్యూటీ స్పీకరు, కొంతమంది సభ్యులు తీవ్ర అసమ్మతిని ప్రకటించారు.

ఆ కార్టూన్ ఈ విధంగా వుంది. ఒక గడియారం, ఆ గడియారం రెండు ముల్లులను కొంతమంది పార్లమెంటు సభ్యులు నడవకుండా ఆపేస్తున్నారు. మరొక వ్యక్తి పెన్డ్యులం ఆడకుండాపట్టు గట్టిగా పట్టుకున్నాడు. ఆ వ్యక్తి చిత్రం డిప్యూటీ స్పీకరు పోలికగా వుంది. ఇక ఈ చిత్రం గడియారాన్ని వెనక్కు నడిపించుచుం అన్న ముకుటంతో ప్రకటించబడింది.

డిప్యూటీ స్పీకరు ఈ విషయమై పార్లమెంటులో మాటాడుతూ, సభాధ్యక్షునిమీద ఈ విధంగా అవాకులు చెవాకులు చిగడం అన్యాయమే గాక, అమర్యాదకరంగాకూడా వున్నదన్నారు. ఈ బిల్లునుగూర్చి నా అభిప్రాయాలు ఎట్టివైనా కావచ్చుకాని, నేను ఈ విషయమై ఇదివరకు అక్రమంగా ప్రవర్తించిందిలేదు. ఇట్లా అపత్రిక చేసిందంటే, ఈ సభను అవమానపరుస్తున్నదనే అర్థం. ఇది చాలా తీవ్ర విషయం అని అన్నారు.

ఈ విషయాన్నిగూర్చి తాను చర్య తీసుకోదలచుకోన్నానని అయితే, అందుకోసం ఇప్పుడు బిల్లుమీద జరుగుతున్న చర్చను ఆపజాలనని ఆయన సభవారికి తెలియజెప్పారు.

పై కార్టూనును ప్రకటించిన పత్రిక మేనేజింగు ఎడిటరు దేశబంధు గుప్త గారు నేడు (సెప్టెంబరు 21) డిప్యూటీ స్పీకరుకు క్షమాపణ ఉత్తరాన్ని పంపారు. అది తమకు తృప్తికరంగా వున్నదనే డిప్యూటీ స్పీకరు అన్నారు.

## క్రీడారంగం

### నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్పు

బొంబాయి, సెప్టెంబరు 21: నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్పునందు నేటి సాయంకాలం రాజపుటానా జట్టు, బీహారు జట్టును 2-1 గోలులతో ఓడించింది. ఇప్పుడు రాజపుటానా జట్టునకు, సైన్యం జట్టునకు క్వార్టరు ఫైనలులో ఆట జరుగుతుంది.

### ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్

ఖర్గపూర్, సెప్టెంబరు 21: ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్ టూర్నమెంటులో సెమీఫైనల్సు నందు ఓడిపోయిన అస్సాం, జి. ఐ. పి. జట్టులకు నేడు ఆట జరిగింది. ఇందులో జి. ఐ. పి. జట్టు అస్సాం జట్టును 3-1 గోలులతో ఓడించి రామచంద్రన్ కప్ పొందింది

### ఇంటర్ యూనివర్సిటీ ఫుట్‌బాల్

కటక్, సెప్టెంబరు 21: ఇంటర్ యూనివర్సిటీ ఫుట్‌బాల్ టూర్నమెంటునందు నేడు మద్రాసు యూనివర్సిటీ జట్టు, ఉస్మానియా యూనివర్సిటీ జట్టును 5-2 గోలులతో ఓడించారు. ఇప్పుడు మద్రాసు జట్టు, 25 వ తేదీన బొంబాయి మైసూరులలో గెలుపొందిన జట్టుతో ఆడుతుంది.

### మద్రాసు ఫుట్‌బాల్ లీగ్

మద్రాసు, సెప్టెంబరు 22: మదరాసు ఫుట్‌బాల్ లీగ్‌నందు నిన్న సాయంకాలం పచ్చయప్ప ఫుట్‌బాల్ క్లబ్బు జట్టు, మద్రాసు రెజిమెంటు జట్టును 2-0 గోలులతో ఓడించారు.

### ఎవర్ మెర్రీ హాకీ

ఎవర్ మెర్రీ హాకీ టూర్నమెంటునందు నిన్న సాయంకాలం గవర్నమెంటు ఆటోమొబైల్సు జట్టు కోలా ఎవర్‌గ్రీన్సు జట్టును 5-1 గోలులతో ఓడించి సెమీఫైనల్సుకు వచ్చింది. ఈ రెండు జట్టులకు లోగడ మూడు సార్లు 'డ్రా' అయి వున్నది. ఇప్పుడు గవర్నమెంటు ఆటోమొబైల్సు జట్టునకు, మద్రాసు యునైటెడ్ క్లబ్బు జట్టునకు ఆదివారం నాడు ఆట జరుగుతుంది.

### మద్రాసు అడ్వొకేట్ల సమావేశము

కాలికట్, సెప్టెంబరు 20: మద్రాసురాష్ట్ర అడ్వొకేట్ల 17 వ సమావేశం అక్టోబరు 12, 13 తేదీలలో యిచ్చట జరుగుతుంది. భారత అటార్నీ జనరలు సభను ప్రారంభిస్తారు. స్వామి గోవిందమీనన్ అధ్యక్షత వహిస్తారు.

## విశ్వనాథ సత్యనారాయణగారికి ఢిల్లీ ఆంధ్రుల సన్మానం

### ప్రముఖ ఆంధ్రనాయకుల ప్రశంస

క్రొత్తఢిల్లీ, సెప్టెంబరు 19: నిన్న సాయంకాలం, ఢిల్లీ ఆంధ్రసంఘం వారు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిని సన్మానించారు. సభకు ఆహారశాఖ సహాయమంత్రి, శ్రీ మొసలికంటి తిరుమలరావు గారు అధ్యక్షత వహించారు. పార్లమెంటు డిప్యూటీ స్పీకర్ మాడభూషి అనంతశయనం అయ్యంగారు, కళా వెంకట్రావు గారు, విశ్వనాథవారి విశ్వతోముఖ కవితాప్రతిభను కొనియాడారు.

"ముప్పదియైదు సంవత్సరాలుగా ఆంధ్ర కవితోపాసన చేస్తూ, అనేక తెరగులలో గద్యంలోనూ, పద్యంలోనూ కూడా స్వీయ ప్రతిభ ప్రకటించి సాహిత్యం, సంగీతం, సర్వంకూడా లిమలో ఇముడ్చుకున్న సత్యనారాయణగారు కాబోయే ఆంధ్ర ఆస్థాన కవి అని అనంతశయనం అయ్యంగారు ఆశీర్వదించారు.

శ్రీ కళా వెంకట్రావుగారు మాట్లాడుతూ, తామున్నూ, సత్యనారాయణగారున్నూ, బందరులో పింగళి, కాటూరి వారితోపాటు సహాధ్యాయులమనిరి. "ఆనాడే సత్యనారాయణగారు పేరెన్నిక గన్న కవి. వారు పాడగా విని ముప్పై సంవత్సరములైనది. తిరిగి ఈనాడు ఢిల్లీలో ఆమహాభాగ్యము లభించినది." అన్నారు. అనంతశయనం గారు చేసిన దీవనతో వారు ఏకీభవించారు.

అధ్యక్షులు వారి యిద్దరి ఆశీర్వచనం బలపరచి సత్యనారాయణగారి వంటి కవులు అప్పుడప్పుడు ఢిల్లీ వస్తూంటే సేగాని, ఇక్కడి వారికి తెలుగు సాహిత్యంతో ప్రత్యక్ష పరిచయం పోతుందన్నారు.

ప్రారంభంలో కపిల కాశీపతిగారు కవిగార్ని పరిచయంచేస్తూ, వారు ఢిల్లీకి క్రొత్తవారు కారనీ, ఈ సన్మాన సభలో వారికి చేసే గౌరవంకంటె సభవారు ఆశించే రసానుభవమే ఎక్కువ అని అన్నారు. "హిందూస్థాన్ టైమ్సు పత్రిక" సత్యనారాయణగారి సన్మాన సందర్భంలో స్వాగత వాక్యాలు వ్రాసిందని తెలిపి ఆ భాగాలు చదివి వినిపించారు. "ఆసేతు హిమాచలమూ, భారత దేశపు వైవిధ్యంలో, రామాయణం వో ప్రధాన సూత్రం. అందులో భాషలకు తల్లి సంస్కృతంపట్ల తెలుగు విద్వాంసుల అభిమానం ఎక్కువ. అటువంటి తెలుగు కూడా చక్కగా వ్రాసించిన సత్యనారాయణగారి రామాయణం వారి ముఖతా వినడానికి గల అవకాశం ఢిల్లీలోవున్న తెలుగువారేగాక, భారతీయులందరికీ, చాలామంచిది. విశిష్టమైన వారి పఠనాచాతుర్యం వారికే చెల్లును. ఆ కవితారసం ఇంద్రప్రస్థ పౌరులు ఆనందింతురుగాక" అని ఆ పత్రిక వ్రాసింది.

శ్రీ సత్యనారాయణగారు, తాము రచిస్తున్న పిల్లల రామాయణం గో ముత్యాలసరములు కంఠమెత్తి శ్రావ్యముగా పాడారు. జనకమూర్ఛని అనందిస్తున్న పట్టాభి సీతారామయ్య గారు, చాలా ప్రశంసించారు.

సభవారికోరికమీద సత్యనారాయణగారు లేఖరవదలెన్నో చదివారు. పలువేమందికి పైగా కిన్నెరసాని పాటలు కావాలన్నారు. ఒక చిన్నపిల్ల "కోకిలమ్మ పాట" కావాలని కోరింది. విసుగు లేకుండా రామాయణంతో ప్రారంభించి, విశ్వేశ్వర శతకం దాకా వెళ్ళి, బ్రహ్మగీతితో త్రిమూర్తిస్తవం ముగించి సత్యనారాయణగారు, ఢిల్లీ రాజకీయ చీకాకులనడుమ, రాగ, రస, రచనాచాతుర్యం పండించి, సభవార్ని సంతోషంలో ముంచి వేశారు.

### బొంబై వెండి బంగారు మార్కెట్

బొంబై, సెప్టెం 22: నేటి మధ్యాహ్నం 2-0 గం||లకు బొంబై వెండి-బంగారు మార్కెటు ధరలు: వెండి (100 తు) రు 188-18-0, బంగారం (తు 1 కి) రు. 111-8-0, సావరిన్ 1 కి రు 76-14-0.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.